" ఓం నమో దేవదేవాయ ద్రాక్షారామ భీమేశ్వర పుత్రనే
కవీశ్వరాయ శ్రీ వేములవాడ భీమలింగేశ్వరాయ నమః "

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం

www.shribheemalingeswaraswamy.org

## శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి జీవసమాధి మఠం

# ఆలయ వర్ణన

గడేకల్లు గ్రామము,
విడపనకల్లు మండలము,
అనంతపురము జిల్లా – 515842

ప్రచురణ: జూలై 2016

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి జీవసమాధి మఠం

# ఆలయ వర్ణన

రచన మరియు రూపకల్పన

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం

www.shribheemalingeswaraswamy.org



ఈశామ్ సర్వేశామ్

సర్వేశామ్ సోమానాథమ్

సోమానాథమ్ మాచమ్మ తనయనామ్

మాచమ్మ తనయనామ్ శ్రీ భీమలింగేశ్వరమ్

శ్రీ భీమలింగేశ్వరమ్ సర్వదయామయమ్

సర్వదయామయమ్ సర్వలోక రక్షకమ్

**ఓం నమో శ్రీ భీమలింగేశ్వరాయ నమః**

" ఓం నమో దేవదేవాయ ద్రాక్షారామ భీమేశ్వర పుత్రనే
కవీశ్వరాయ శ్రీ వేములవాడ భీమలింగేశ్వరాయ నమః "

# జీవసమాధి

జీవసమాధి మందిరాన స్వామివారి వెండివిగ్రహాలు రెండు(ఒక ఉత్సవమూర్తి విగ్రహము), సంజీవమ్మ వెండివిగ్రహము ఒకటి, పంచలోహాలతో చేసిన పార్వతీపరమేశ్వరుల కొలువుదిరి ఉన్నారు. జీవసమాధి వెనుకభాగాన స్వామివారి రూపము చిత్రీకరించబడిన చెక్కఫలక, జీవసమాధి మందిరాన అనునిత్యము దేదీప్యమానముగా వెలిగే అయిదు అఖండ జ్యోతులు ఉంటాయి.

స్వామివారి మందిరము నందు ఎల్లప్పుడూ అంగారు ఉంటుంది. జీవసమాధి మందిరము ముందు ఒక సువిశాలమన మంటపము, ముఖమంటపానికి ఇరు వైపులా పీరుజాతి వారు బహుకరించిన నగారాలు ఇప్పటికీ కూడా కొలువుదీరి ఉన్నాయి. ముఖమంటపమునకు ఎదురుగా పీరుజాతి వారు స్వామివారికి బహూకరించిన  గుర్రము (సమాధి) బృందావనము ఉన్నది. అందులో హనుమంతరాయలు కొలువుదీరి ఉన్నారు.

# పీరుజాతి వారి వృత్తాంతము

చిప్పగిరి గ్రామానికి చెందిన పీరుజాతివారు అరువదినాలుగు తాంత్రిక విద్యలయందు నిష్ణాతులు. స్వామివారి మహిమలను చూసిన వీరు, అసూయతో ఎలాగైనా ఆయన్ను భంగపరచాలని లేకుంటే తమ ప్రాచుర్యము తగ్గిపోతుందనీ, ఒక కుతంత్రము చేశారు. వీరు ఒక మల్లెపూలవస్త్రమును పుష్పములతో తయారుచేసి అందులోని ప్రతి మల్లెపువ్వులో తమ నేర్చిన యావత్తు తంత్రవిద్యను కల్పించి, అంతే కాక తంత్రవిద్యతో సృష్టించిన మాయా పులిని వాహనముగా అధిరోహించి, ఒక పల్లెంలో తాము తయారు చేసిన వస్త్రాన్ని ఉంచుకొని, అంగరంగవైభవంగా మేళతాళాలు సూర్యచంద్ర సురిటీలూ, నగారాలతో గడేకల్లుకు బయలుదేరారు. వీరు మార్గమధ్యమున ఉండగానే, స్వామి తన దివ్యదృష్టితో చూసి సంజీవమ్మను పిలిచి "సంజీవి! చిప్పగిరి గ్రామము నుండి పీరుజాతివారు వస్తున్నారు. వారికోసం పొలం వెనుకపడి ఉన్న సద్దచొప్పను తీసుకు వచ్చి కుప్పచేసి ఉంచమని" చెప్పి, గ్రామస్తులు చూస్తుండగానే స్వామివారు ఒక మొండిగోడపై కూర్చొని వాయువేగమున పీరుజాతివారికి ఎదురేగి గ్రామానికి ఆహ్వానించారు. అంతలో సంజీవమ్మ సద్దచొప్పను కుప్పగా వేసి ఉంచింది. పీరుజాతివారు, స్వామి మీ కోసము పూలవస్త్రమును తెచ్చామన్నారు.

......ఇంకా ఉంది

మీరు దీనిని ధరించవలెనని కోరినారు. ఒక జాడీ సారాయి తెచ్చి పుచ్చుకొమ్మని అడిగారు. అప్పుడు స్వామి ఆ సారాయి మొత్తమూ తాగినారు. స్వామి మత్తులో ఉన్నారని తలచి, ఒక మణుగు సీసమును బాగా కాంచి దీనిని కూడా త్రాగగలరా? అని స్వామివారి నోటి యందు పోయడానికి ప్రయత్నించారు. స్వామివారు సరే అని నోరు తెరిచారు. ఆ సీసమంతయూ త్రాగి వేసిన తర్వాత మంచి భోజనము చేసిన వారివలె త్రేపుచూ సీసమును యావత్తూ అందరూ వారు చూస్తుండగానే, మలస్థానము నుంచి విడిచిపెటారు. తమ పాచికలు పారనందుకు కలత చెంది, తమతో తెచ్చిన మంత్రపూరితమైన పూలవస్త్రమును స్వామిపై కప్పినారు. స్వామివారు సంజమ్మతో కుప్పగా పోసిన సద్దచొప్పను అంటించమని చెప్పారు. ఆ వస్త్రముతో పాటు స్వామివారు మంటలో  కూర్చున్నారు. ఆ పూలదారాలు కాలుతున్నకొద్దీ ఛిటపటమని శబ్దం చేస్తూ వారి తంత్రవిద్యలు ఒక్కొక్కటీ భస్మీకృతమవుతున్నాయి. క్రమముగా తము శక్తిహీనులై, విద్యలన్నీ కోల్పోతుండడం తెలుసుకొని వారు స్వామివారిని " మహాత్మా! మేము చేసిన అపరాధములను మన్నింపుము. మీరూ కూడా మాలాగా మంత్ర విద్యవల్లనే మహిమలు చూపుతున్నారని భావించి, మిమ్ము పరీక్షించదలచాను. పొట్టకూటి కోసము చేసే విద్యలు మీ ముందు సాగవని తెలిసింది.

......ఇంకా ఉంది

మేము మూఢులము. మమ్ము కాపాడండి” అని ప్రార్థించారు.స్వామివారు వారిని క్షమించి మంటలనుండి బయటకు వచ్చి, వారి యందు దయతో, తంత్రపూరితమైన ఆ వస్త్రమునుంచి రెండు దారపుపోగులను భస్మీపటలము కాకుండా బయటకు పడవేసి వారి జీవనోపాధి కొరకు కొంత విద్యను ప్రసాదించి పంపి వేశారు. వారు కృతజ్ఞత భావముతో, భగవద్భక్తి ముందు తాంత్రిక విద్యలు పారవని తెలుసుకుని అందుకు సంకేతముగా తమతో పాటి తెచ్చిన ఆ రెండు నగారాలను, (నేటికీ దేవాలయములో ఉన్నవి) ఒక గుర్రమును కానుకగా సమర్పించుకున్నారు.

ఇలా స్వామివారు ఆనాడు రాబోవుకాలాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ తాంత్రికవిద్యలను మరెవరూ దుర్వినియోగం చేయకుండా లోకకళ్యాణార్థం కోసం సమూలంగా భస్మీపటలం కావించినారు. స్వామివారు భస్మీపటలం కావించిన ఈ తాంత్రికవిద్యలు తెలిసిన వారు ఉన్ననూ, నేడు అవి ఎవరిమీదనూ పని చేయవు.

# స్వామి వారే స్వయంగా నాటిన వేప వృక్షం

ఈశాన్యమూలన స్వామివారి కాలము నాటి గోని వృక్షము మరియు వేప వృక్షములు ఉన్నవి. ఈ గోని వృక్షము స్వామి వారి కాలము నాటిది. చాలా అరుదైన వృక్షము. ఈ గోని వృక్షము మీద సహజసిద్ధంగా ఏర్పడిన వినాయకుని స్వరూపము దర్శనమిస్తుంది. పదిహేను ఇరవై ఏళ్ళ క్రిందట ఈ గోని వృక్షము నుంచి చెక్కర వంటి తీయటి పొడి రాలేదట. అప్పట్లో దీన్ని ప్రసాదముగా కూడా పంచేవారట. స్వామివారు దంతావదాణం చేసి, నేలపై నాటిన వేపపుల్ల ఎక్కడైతే చిగురిస్తుందో, చిరస్థాయిగా అక్కడే నిలిచిపోవాలని సంకల్పించారు. అలా ఎన్నెన్నో ప్రాంతాలు అంబమ్మ మఠం, పెదపప్పూరు, అశ్వర్థం, కర్నూలు, అలూరు, రామదుర్గం, బెల్డోణ, చాబాల మొదలగు ఎన్నో ప్రాంతాలను సందర్శించారు. చివరకు పుణ్యప్రదమైన గడేకల్లులో (ఇప్పటి వేపవృక్షం ఉన్న చోట) స్వామివారు నాటిన వేపపుల్ల చిగురించింది. తన సంకల్పం ప్రకారము ఆషాడశుద్ధ దశమినాడు జీవసమాధిలో ప్రవేశించగా, మరుసటి ఐదురోజుల పాటుఅనగా ఆషాడ శుద్ధ పౌర్ణమి దాకా అఖండభజనలు నిర్వహించి, వచ్చిన భక్తజనానికి షడ్రసోపేతముగా భోజనాదులను ఏర్పాటు చేసారు.

# పురాతన బావి

స్వామివారి జీవసమాధి మందిరానికి వాయువ్యభాగాన స్వామి వారి కాలాన త్రవ్వబడిన బావి కలదు. ఈ బావి నీటిని స్వామివారి పూజా కార్యక్రమాలకి వినియోగిస్తారు. ఇప్పుడైతే ఈ బావి నీటిని గ్రామస్తులు పెద్దగా త్రాగునీటి అవసరానికి వినియోగము తగ్గింది కాని, శ్రీ సత్యసాయి నీటిపథకము పూర్తి అవ్వకమునుపు, గ్రామములో ఎంతో నీటి కొరత ఉన్న రోజుల్లో గ్రామస్తులు నిత్యావసరాలకు మరియు త్రాగునీటి కోసము ఈ బావి మీదే ఆధారపడేవారు. ఇప్పటిదాకా ఎన్నడూ ఈ బావిలో నీరు తగ్గిపోవడము కాని, ఇంకిపోవడముగాని జరుగలేదు.

# ధ్వజస్తంబము

స్వామివారి మఠానికి ముందరి భాగాన (తూర్పు ముఖాన) నిర్మింపబడిన దాదాపు 50 అడుగుల ఎత్తైన గొప్పశిలతో నిర్మింపబడిన ధ్వజస్తంభము దర్శనమిచ్చును. ఈ ధ్వజస్తంబము నిలబెత్తినప్పటి వృత్తాంతము.

ధ్వజస్తంభము నిలబెట్టుటకు ఆ కాలమున యంత్రములేవీ లేవు. జనసహాయముతో నిలబెట్టాలి. ఈ గ్రామమునకు చుట్టూ ఉన్న పల్లెలనుంచి వచ్చిన జనాలతో నాలుగురోజులుగా శ్రమించారు, కానీ స్తంబమును నిలుపలేకపోయారు. ఐదవరోజున ధ్వజస్తంబమును చేసిన సంత్రాసు, స్వామివారిని గురించి ఈ విధముగా స్తోత్రము చేసాడు." స్వామి! నా చేతనైనంత వరకూ కష్టపడి పనిచేసి, ధ్వజస్తంభమును చేసితిని. దానిని ఎన్ని విధములుగా ప్రయత్నించిననూ లేవలేదు. పరగ్రామము వారందరూ ఈ గ్రామమున ఎన్ని రోజులుండగలరు? మిగితా జనులు రేపు వెళ్ళిపోతున్నారు. ధ్వజస్తంభము గతి యేమిటని స్వామిని ప్రార్థిస్తూ, చింతిస్తుండగా, అతనికి నిద్దుర వచ్చినట్లు కాగా, అతడు నేలమీద పడుకున్నాడు. వెంటనే అతనికి స్వామి స్వప్నములో కనిపించి "ఒరే సంత్రాసు, నీవు చింతించనక్కర్లేదు. ఇప్పుడు వెళ్ళి, అక్కడ స్త్రీలుంటే స్త్రీలతోనూ, లేదా పురుషులుంటే పురుషులతోనూ పట్టించుము. ధ్వజస్తంభము తప్పక నిలుస్తుంది."

.......ఇంకా ఉంది

అని ఒక సాధువువేషములో కలలో సాక్షాత్కరించాడు. సంత్రాసుకు వెంటనే మెలకువ వచ్చింది. అతడు స్వామి మాట ప్రకారము ధ్వజస్తంభము ఉన్న చోటకు వెళ్ళి అక్కడున్న స్త్రీ,పురుషులను పట్టమని కోరాడు. అయితే అక్కడున్న వారు నవ్వి వందలమంది 4 రోజులుగా ప్రయత్నము చేసినా ఇంచు కూడా లేవని ఈ స్తంభము ఈ కొద్దిమంది చేత లేవడం అసంభవము. నీకు పిచ్చిగానీ పట్టిందా అని పరిహాసము చేసారు. అప్పుడు ఆ సంత్రాసు " అయ్యా! ఇక్కడ ఉన్న యావత్తు స్త్రీ, పురుషులందరూ కలిసి ప్రయత్నించండి. ఈ సారి ఈ ధ్వజస్తంభము లేవకపోతే నిశ్చయముగా ఈ ధ్వజస్తంభమునకు మా ప్రాణములను అర్పిస్తానని వారితో చెప్పాడు. అప్పుడు అక్కడున్నవారు అతని మాట ప్రకారము ప్రయత్నించారు. ఆశ్చర్యకరంగా ఆ ధ్వజస్తంభము లేచి, సరిగ్గా స్థలములో కూర్చున్నది. ఆ సమయానికి భోజనానికని వెళ్ళి తిరిగి వచ్చిన వారు జరిగినది చూసి చాలా సంభ్రమాశ్చర్యాలకులోనై, సంత్రాసును విచారించగా అతను తనకు స్వప్నమైన విషయమంతా చెప్పగా, అందరూ స్వామివారిని అనేక విధములుగా ప్రార్థించి, పూజా పురస్కారాలు అచరించి, గ్రామస్తులందరూ వారివారి ఇండ్లకు వెళ్ళిరి. ఈ ఘన చరిత్రను కలిగిన ధ్వజస్తంభము నేటికీ దేవాలయము ముందర ఉన్నది.

# సంజీవమ్మ సమాధి

ఆలయప్రధాన ద్వారానికి ఉత్తరభాగాన మహాభక్తురాలు, శిష్యురాలైన సంజీవమ్మ సమాధి, సంజీవమ్మ సమాధి ముందరి భాగాన మొదటిపూజారి పక్కీరప్పగారి సమాధి ఉన్నది.

గురువు త్రిమూర్తి స్వరూపుడు. నిరాకారుడైన భగవంతుడే సాకారుడై సద్గురువు రూపంలో భూమిపై అవతరిస్తాడు. తల్లి తండ్రులు మనకు తనువునిస్తారు. పెంచి పోషిస్తారు. కానీ ప్రారబ్ధాన్ని తప్పించలేరు. కానీ సద్గురువుల అనుగ్రహానికి పాత్రులైనవారు ఈ కష్టనష్టాలను అధిగమించగలరు. కల్పవృక్షమూ, కామదేనువూ కోరినవి మాత్రమే ఇవ్వగలవు, కానీ గురువు వాటితో పాటి ముక్తిని కూడా ఇవ్వగలడు. గురువు లేకుండా మోక్షం కలుగదు. ఎంతటి విత్తనమైనా నీటి చుక్క తగలనిదే ఎలా చిగురించదో, అలాగే ఎంతటి మహోన్నతులైనా కానీ, సాక్షాత్తు ఆ భగవంతుడే అయినా భూమిపై అవతరించాక గురువును ఆశ్రయించనిదే, గురుసేవ చేయనిదే జ్ఞాన సిద్ధి ప్రకాశమును పొందలేరు. గురువు మూలంగానే సదసద్వివేకము, భక్తి వైరాగ్యాలు, జ్ఞానము వాటిద్వారా మోక్షము సిద్ధిస్తుంది. అటువంటి సద్గురువైన శ్రీ భీమలింగేశ్వరస్వామిని అచంచలమైన భక్తివిశ్వాసంతో, త్రికరణ శుద్ధితో సేవించిన ఆదర్శశిష్యురాలు కారణ జన్మురాలు

.......ఇంకా ఉంది

శ్రీ సంజీవమ్మఅవ్వ. ఆమె గురుభక్తికి, గురుసేవకు మెచ్చిన స్వామివారు సూర్యచంద్రులున్నంత కాలం, తన శిష్యురాలుగా కీర్తించబడేలా, అంతేకాక తన దర్శనానికి వచ్చిన భక్తులు మొదట సంజీవమ్మ దర్శనం చేసుకున్న తర్వాతనే తన దర్శనం చేసుకొనేలా వరమిచ్చారు. సంజీవమ్మ అవ్వ స్వస్థలం చాబాల గ్రామం.

# తొలి పుజారి పక్కీరప్ప గారి సమాధి

సంజీవమ్మవ్వ సమాధి ముందుభాగాన పక్కీరప్ప గారి సమాధి ఉంది. వయసు మీదపడుతున్నప్పటికీ సంజీవమ్మకు ఎల్లప్పుడూ స్వామివారి సేవ గురించే తపించేది. తన తదనంతరం స్వామివారి సేవ ఎలాగా? అనిఎంతగానో విచారణ చేసేది. ఈ విషయాన్ని తెలుసుకున్న స్వామివారు సంజీవమ్మ గురుసేవానిరతికి మెచ్చి తన తపోశక్తితో ఒక బాలుడిని సృష్టించి, " అ కొండలో ఒక పిల్లవాడు ఏడ్చుచున్నాడు. వెళ్ళి తెచ్చుకొని పెంచమని, ఈ బాలుని కోసం రోజూ ఒక నల్లకుక్క వచ్చి తన స్తన్యంతో పాలుపడుతుందని" ఆనతిచ్చారు. అలా సంజీవమ్మ పెంచిన ఈ బాలుడే పక్కీరప్ప. స్వామివారు జీవసమాధి ప్రవేశము తరువాత, ధూపదీప నైవేద్యాదికములను నిర్వహించిన తొలి పూజారి. ఈయన వంశీకులే నేటికి స్వామివారి మఠం పూజాకార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

# కదిరప్ప మంటపము

ధ్వజస్తంభానికి ఉత్తరవైపున సువిశాలమైన ఈ మంటపమును కదిరప్ప అను భక్తుడు నిర్మింపజేశారు. ఇతను స్వామివారిని అత్యంత భక్తిశ్రద్దలతో పూజించారు. స్వామివారి మఠానికి విచ్చేసే భక్తుల సౌకర్యార్థం తన రోజువారి కూలి సంపాదనలో దాచి ఉంచిన సొమ్మును ఖర్చుపెట్టి ఈ మంటపమును కట్టించారు.

# అన్నపూర్ణేశ్వరి అన్నదాన సత్రము మరియు వసతి గృహము

ధ్వజస్తంభానికి దక్షిణభాగాన సువిశాలమైన అన్నపూర్ణేశ్వరి అన్నదాన సత్రము ఉంది. ఈ అన్నదాన సత్రమునందు, ప్రతి అమావాస్యనాడు (సాయంత్రవేళ), ప్రతి ఏటా ఆషాఢపూర్ణిమ(గురుపూర్ణిమ) మొదలు స్వామివారి రథోత్సవాలు పూర్తి అయ్యేదాకా, స్వామివారి జన్మదినోత్సవమైన శ్రావణశుక్లపంచమినాడు స్వామి వారి దర్శనార్థం విచ్చెయు భక్తాదులకు అన్నదాన కార్యక్రమము జరుపబడును.

అమావాస్యనాడు అన్నదానము జరుపగోరు భక్తాదులు ముందుగానే మఠంలోని కార్యనిర్వహణాధికారిని సంప్రదించి వారి పేరును నమోదు చెసుకోవాలి.

స్వామి వారి సందర్శనార్థం వచ్చిన భక్తాదులకు అన్నదాన సత్రము పైభాగాన వసతిగృహముల ఉన్నవి.



శ్రీ భీమలింగేశ్వరస్వామి తపస్సు గావించిన స్థలం

చౌడేశ్వరి దేవి కొండ (చౌడమ్మ అవ్వ కొండ), గడేకల్లు గ్రామము

# సలహాలు మరియు సూచనలు

శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం లో శ్రీ భీమలింగేశ్వరస్వామి భక్తులందరూ భాగస్వామ్యులె కావున మీ అమూల్యమైన సలహాలను, సూచనలను మాతో పంచుకోండి


భీమేష్ చౌదరి కాచరగడ్ల(రఘు),
వ్యవస్థాపకులు, అధ్యయన నిపుణులు
శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం
చరవాణి: +91 8008911848,
ఈ మెయిల్: kacharagadla@gmail.com

రెడ్డి కిరణ్ కుమార్ బెస్త
అధ్యయన నిపుణులు
శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి జీవిత చరిత్ర ప్రాజెక్ట్
చరవాణి: +91 9490441355
ఈ మెయిల్: mb.reddykiran@gmail.com



ఓం నమో శ్రీ వేములవాడ భీమలింగేశ్వరాయ నమః

సర్వేజనా సుఖినోభవంతు



శ్రీ వేములవాడ భీమలింగేశ్వరస్వామి అధ్యయన కేంద్రం